" సర్వం లింగమయం జగత్ "

శ్లో॥ న వీరశైవ సదృశం మతమస్తి జగత్రయె !
సర్వభోగ ప్రదం పుణ్యం శివసాయుజ్యదాయకం !!

# వీరశైవ గీతావళి






గ్రంథకర్త :

**పం॥ డా॥ పెద్దమఠం రాచవీర దేవర**

**"తీర్థ" "M.O.L."**

వీరశైవ గీతావళి

ప్రతులు : 500

తృతీయ ముద్రణ

వెల : రూ. 30

ప్రకాశకులు : వీరశైవ గ్రంథమాల
3-3-139, కాచిగూడ,
నెహ్రూ హైస్కూలు వద్ద,
హైదరాబాద్ - 27.

ముద్రణ :
anand printers
3-4-168, lingampally,
kachiguda, hyderabad-27.
✆ : 7561270





శ్లో॥ నమో ఉగ్రస్వరూపాయ-నమోజిష్ణ్వాది శాత్రవె
దక్షయజ్ఞ వినాశాయ వీరభద్రాయతే నమః ॥

## కవిపరిచయము

భక్త జనావళికి ఆకృతి సాంస్కృతిక సంస్థ సవినయంగా సమర్పించు స్వరావళి ఈ "వీరశైవ గీతావళి

భారతీయ వాఙ్మయ చరిత్రలో శైవ సాహిత్యానికి విశిష్టమైన స్థానం వుంది. శివుడే పరదైవంగా, పరమదైవంగా నెలకొన్న వీరశైవ మతం జగదురు శ్రీరేణుకాచార్యులు బసవేశ్వరుడు శ్రీపతి పండితుడు, శివలెంక మంచన పండితుడు, మల్లికార్జున పండితుడు పండితారాధ్యుడు వంటి మహనీయులవల్ల, నన్నెచోడుడు, పాల్కురికి సోమనాధుడు, ధూర్జటి వంటి మహాకవుల వల్ల పరిపుష్టమై ప్రవహించి, దాక్షిణాత్య భక్తజన హృదయాలో కూడా అనంతజ్ఞాన సస్యాల్ని పండించింధి.

శివాత్ పరం నాస్తి-ధ్యాన నిష్ఠతో వీరశైవం కన్నడ మహారాష్ట్ర తెలుగు సీమల్లో పల్లవించి, పుష్టించి, ఫలించింది.

బహుముఖ ప్రజ్ఞావంతులు, బహుభాషాకోవిదులైన డా॥ పండిత పెద్దమఠం రాచవీర దేవర రచించిన ఈ "వీరశైవ గీతావళి" ఆవీరశైవ మహావృక్షానికి పూసినభక్తిరస ప్రసూనావళి।

వీరశైవ సాహిత్య సార్వభౌమ, శివ సిద్ధాంత సాహిత్య చతుర, కన్నడ జాణ.,," వీరశైవ విద్వన్మణి అయినడా॥ పండిత రాచవీరదేవర ఎనభై ఏళ్ల క్రితం మెదక్ జిల్లా జోగిపేటలో శ్రీమతినాగమాంబ, వీరయ్య పుణ్యదంపతులకు జన్మించి వీరశైవ మహేశ్వరాచార సంపన్నులై: వీరశైవ ధర్మ ప్రచారానికి తమ జీవితాన్ని ముడుపుకట్టి, అనేకానేక దాన ధర్మాలతో త్యాగ

గుణాలతో ఆదర్శప్రాయంగా జీవిస్తు, శివానుభవ, వీరశైవ ధార్మిక వ్యాస సంపుటాలు. వీరశైవ వైభవం, జగద్గురు శ్రీరేణుకాచార్యులవారి చరితామృతం-జగత్ జ్యోతి బసవేశ్వరుని వచనాలు, శివగీత, బసవపురాణం, పంచాచార్య సంక్షిప్త ఫక్కీయ శతకత్రయ సారం వంటి అనేక ఉత్తమోత్తమ రచనలు చేసి వీరశైవాచార పరాయణుల్ని. విద్వల్లో కాన్ని అలరించిన మహనీయులు. షడక్షరి మహాస్వామి, విదూపాక్షానంద మహాస్వామి వారి శిష్యులైన పం. రాచవీరదేవర గారి కలం నుండి భక్తిరస బంధురంగా ప్రబోధాత్మకంగా జాలువారిన యీ వీరశైవ గీతాలకు.

సుమధుర సంగీతాన్ని సమకూర్చిన వారు సుప్రసిద్ధ గాయకులు, వర్ధమాన సంగీత దర్శకులు శ్రీ MRK ప్రభాకర్ రావు.

భావానుగుణంగా శ్రీ MRK ప్రభాకర్‌రావు శంకరాభరణం, మాయామాళవ గౌళ, దేశ చారుకేశి, యమునా కళ్యాణి, శివరంజని, శ్రీరాగాల వంటి హృద్యమైన రాగాలతో బాణి కట్టిన శ్రీరాచవీర దేవరగారి వాణిని మీకు.

శ్రీ MRK ప్రభాకర్‌రావు, శ్రీ V. S. రామచంద్రం, శ్రీ లక్ష్మణమూర్తి, శ్రీమతి ఆర్. అనసూయ, శ్రీమతి విద్యాభారతి, కుమారి N.C. సౌజన్య తమ గళ మాధుర్యంతో మీకు అందిస్తున్నారు. ఈ వీరశైవ గీతావళిని, మీకు సమర్పిస్తూ మీ ఆశీరభినందనకై మీ "అక్సృతి" సుధాకర్. అంజలిఘటిస్తున్నాడు.

సికిందరాబాద్ నిరంజనేశ్వర మఠంలో

**శ్రీ బసవేశ్వర జయంతి ఉత్సవాల సందర్భంగా**

**డా॥ శ్రీ పెద్ద మఠం రాచవీరదేవర గారి**

*పాదపూజా సందర్భములో తీసిన ఫొటోగ్రాఫ్స్*



# అక్షరాంజలి

సమర్పణ :- ఎం. శంకరయ్య MA. MOL
తెలుగు పండితులు, ఇబ్రాహింపటన్

శివశ్రీ పెద్దమఠము రాచవీరదేవరగారు లబ్దప్రతిష్ఠులైన పండిత వర్యులు. సంస్కృతాంధ్రాలలో చక్కని వైదుష్యంగలవారు కర్నాటత హిందీ ఆంగ్లములలో సముచిత పరిచయముగల సాహితీవేత్తలు "పండితరత్న" ధర్మనిరత" సాహిత్యవిశారదాది బిరుదాంకితులు, తెలుగు విశారదులై హిందీ భూషణులై. కన్న డమున జాణలై యుండియు కలకత్తా నుండి సంస్కృతమున "కావ్యతీర్థ" పట్టమును, ఉస్మానియా విశ్వవిద్యాలయు నుండి "MOL " ప్రాచ్య భాషాపట్టమును చేపట్టిన విద్యాధికులు, వీర శైవధర్మతత్వ ప్రచారమునకై వీరశైవధర్మా న్వేషణము, బసవేశ్వరుని తత్వములు, మహాజ్ఞానిచన్నబసవన్న, రత్నత్ర యము, ఇష్టలింగార్చినవిధి, మున్నగు గ్రంధరాజములను వెలయించిన ప్రసిద్ధరచయితలు భాగ్యనగరమునందలి వివిధ పాఠశాలల కళాశాలలో. సంస్కృ తాంధ్ర భాషాబోధకులుగా నుండు చునే కష్టనష్టములకోర్చి యొకదశాబ్దము పాటు "వీరశైవధర్మ" అను పత్రికను సక్రమముగా నిర్వహించిన దీక్షాధ్యక్షులు.

ప్రస్తుతము వీరువీరశైవ సోదరులందరకు అందుబాటులో నుండి, హృదయాహ్లాదకరముగా పాడుకొనుటకు వీలుండునట్లు రచించిన వీరశైవధర్మభావగీతికలు అను చిఱుపొత్తమును ప్రకటించుచున్నారు. దీనికి స్వాగత సూచకముగానీ "అక్షరాంజలి" ఘటించుచు, వీరింకను ఇతోధిక సాహిత్యసేవ చేసి సహృదయుల కృతజ్ఞతలకు పాత్రులు కావలసినదిగను, అట్టి సదవకాశమును అనుగ్రహించవలసినదిగా నా పరమశివుని ప్రార్థించుచున్నాను.

శ్రీకరవీరశైవమతసింధు సముద్భవ సోముడోయనన్
ప్రాకటవీరగోత్రమున ప్రాభవమందిన పూజ్యవీరనా
మాంకితునాగమాంబసతి, మానితపుత్రుని; రాచవీరను
శ్లోకుని, దేవరాఖ్యుడను శోభితనాముని, సంస్తుతించెదన్

2 సంస్కృతమ్మునతీర్థ, కన్నడమున, జాణ
పరగ తెలుగున ఎం. ఓ. ఎల్. పట్టముఁగొని
ఆంగ్ల హింద్యాదిభాషలనరసి చూచి
పంచాభాషాప్రవీణుడన బరగితివి భువి

3. అరియ పండిత పరిషధ్యక్షుడవయి
సంస్థకోనరించి సేవ సముచితముగ
సభ్యపండిత మండలి సాధు సాధు
అనగా పేరొందినాడవోయనఘమూర్తి

4. ఆంధ్ర దేశమునందున నలరుచున్న
వీరమాహేశ్వరుల సభను ఘదితముగను
స్థాపితముచేసియధ్యక్షస్థానమూని
చక్కగానడుపు దేవరకు నాటియెవరు?

5. మమత శ్రీవీరశైవధర్మమునుజాట
పత్రికను నిర్వహించి తాపదియునేండ్లు
మీదుధర్మాభినిరతికి మీదుకృషకి
"అక్షరాంజలి" రాచవీరాభిధేయ



# మంచి గ్రంథము

నిండు యవ్వన వయసులో నుండునపుడు
పండితుడు "రాచవీరుడు" మెండు శ్రమకు
నోర్చివ్రాసిన గేయాలజేర్చికొన్ని
గ్రంథముగనాంధ్ర జనతకు నందజేసె :
అట్టి దానిలో మరికొన్ని పెట్టి యిపుడు
"భావగీతిక"లను పేర భవ్యమైన
ధర్మ కర్మల మర్మము ధరణిజూపు
"మంచి గ్రంథము" గాంచి హర్షించి గొనుడి.
తేనెటీగలు దెచ్చెడితీయనైన
మధువుకన్నను గొప్పవీ మధురమైన
భక్తి రక్తికి ముక్తికి బాటచూపు
భావగీతికలలరారు బడయరండి.
ఇంతకన్నమిన్న యెన్నియో రచనలు
జేసి జగతిలోనవాసికెక్కి
స్థిరసుయశము "రాచవీరుడు" నార్జింప
దేవుడెల్ల వేళ్ళ బ్రోవుగాత.

ఇట్లు
సంగమేశ్వర్ "సంగమ్" కవి

24-12-83 అధ్యక్షులు మెదక్ మండల రచయితల సంఘం.
జోగిపేట

## కళాప్రపూర్ణ : డా॥ దివాకర్ల వేంకటావధాని

ఎం. ఏ. (ఆనర్సు) పి. హెచ్. డీ.
రిటైరు:-తెలుగుశాఖాధ్యక్షులు, ఉస్మానియాయునివర్సిటి. హైె

మిత్రులు పం॥ రాచవీర దేవర "M.O-L" తీర్థ" గారు రచించిన "వీరశైవ ధర్మ భావగీతికలను" సాదరముగా పఠించి ఆనందించితిని. శ్రీ దేవరగారు సంస్కృతాంధ్ర కర్నాటకాది పంచభాషలలో ప్రవీణులై చాల కాలముపాధ్యాయునిగా నుండి ప్రశస్తిగడించుట యేగాక జోగిసేట. సదాశివపేటయందలి పెద్ద మఠముల కధిపతులై తాను విశ్వసించిన వీరశైవ మతమును ప్రచారము చేయుటకును, వీరశైవ మతావలంబులనభివృద్ధి పర చుటకును, నిరంతరము కృషిచేయుచున్నారు. వారు 1952 లో వీరశైవతరుణగేయములను రచించిరి. ప్రాశస్త్యమును బట్టి ఆ గ్రంథము చిరకాలముననే చెల్లిపోవుటచే యిప్పుడు మరికొన్ని గేయములను జేర్చియీగ్రంథమును ప్రకటించి యున్నారు ఇందు మొదట నొక దండకముగలదు శ్రీ భండారి తమ్మయ్య గారిచే పరిష్కరింపబడి యందులో దేవరగారి వంశక్రమమంతయు వర్ణింపబడినది. తర్వాత కొన్ని పూర్వరచితములైన స్వసంస్కృ త శ్లోకములను మరి సర్వేశ్వర, శ్రీ కాళహస్తీశ్వర శతక ములందలి పద్యములను భక్తుల వుపయోగార్థము చేర్చబడినవి. వీరశైవ ధ్వజారోహణ గేయముభక్త్యావేశపూరితమై హృద్యము గా నున్నది. శ్రీయిష్టలింగస్తుతి, రేణుకా చార్యస్తుతి, బసవస్తుతి

శైవులందరును భక్తితో చదువదగినవై యున్నవి. యువకుల శపథము, "గీత, "సుగీత" కర్తవ్య" అనునట్లు ఊరకచదువుటయే గాక నందు చెప్పబడినట్లు చేయుటకు గూడ యత్నింప వలసి యున్నది. భగవదాహ్వానము మనోబోధ అను గేయములు చక్కని భావములతో గూడియున్నవి. శీతాకాలపు బెడద కవి గారి లోకానుభవమును చాటుచున్నది. భారతమాత యెడను. ఆంధ్రమాతయెడను శారదా దేవి యెడను, వారు చూపిస్తున్న భక్తి ప్రశంసనీయమై యున్నది.

ఉపాధ్యాయుల దినమునకును బాలుర దినమునకును సంబంధించిన గేయములును, రాగాలాంకృత మాలాషట్కము ను, రమణీయమునై యున్నవి.

శ్రీ దేవరగారు తెలుగు సంస్కృతము, హింది కన్నడములందు గూడ కొన్ని గేయములను రచించియుంచిరి, యివి వారి బహు భాషా పాండిత్యమును కవితా కౌశలత్వమును చాటుచున్నవి.

అందరును పాడుగొనుటకనువుగా నుండవలెనను ఉద్దేశ ముతో వారు సులభములైన పదములనే వాడుటయేగాక సినిమా వరుసలలో గేయములను రచించి యున్నారు. మానవుడు లౌకిక వ్యాపారవ్యగ్రుడైనను భగవంతునియెడ వుపేక్ష వహించుట యుక్తముగాదు. సర్వకార్య విజయమునకును అతని అనుగ్రహ మత్యంతావశ్యకమ. అతనినిస్మరించి ప్రేరణ మతము వలన

గలుగుచున్నవి. మానవుని అభివృద్ధికిని, ఆధ్యాత్మికోన్నతికిని తోడ్పడితీరును.

ఈ గేయములలో శ్రీ దేవరగారులయను పాటించినను, యతిప్రాసలకైయంతగా ప్రయత్నించి యుండలేదు. ఐనను కొన్ని చోట్లయవి యప్రయత్నముగా దొరలెను ఇవి భావప్రధానములైన గేయములు, సర్వసుబోధకములు వీరశైవులేగాక యితరులును వీటినిచదువుకొని యానందింప వచ్చును వీరాధ్యక్షలైనను సమాజముకొరకు సర్వవిధములపాటుబడుచున్న శ్రీ దేవరగారి యముద్రిత గ్రంథములన్నియు త్వరలో ప్రచురింపదగియున్నవి. వీరశైవ సమాజమువారును యితరులు గూడ అందుకు తోడ్పడుదురని ఆశించుచున్నాను. 28-12-80

## :=కృతజ్ఞతలు:=

అర్థించడముతోను తమయమూల్యమైన యభిప్రాయములను వ్రాసియిచ్చియీలఘు పోత్తమునకు శోభను గూర్చిన పెద్దలందరికి నా కృతజ్ఞతాభివందనములు.



(స్వీయకృతులలో

శ్లో॥ ఏకాభార్యామహాగుణవతీ, ఈశ్వరాఖ్యాసుశీలా
అన్యాభార్యాగృహకర్మధర్మనిరతా, సంగాఖ్యావిదుషీమణి
ఏతాభ్యాంహృదయైకప్రాణపతిరహం శ్రీరాచవీరాఖ్యదేవః॥

శ్లో॥ ప్రథమపుత్రోమే, బసవరాజాఖ్యదేవరః॥
ద్వితీయోమే ప్రభులింగాఖ్యదేవర ః॥
తృతీయాపుత్రీమే, శివరాణ్యాఖ్యాసుశీలహి సా
జనకస్తేషామహంరాచవీరాఖ్యదేవరః॥



=ః అన్యకృతులు ః=

బాపు బసవరాజ భూషాసీనహుదయ్యా ।
ఆపరబ్రహ్మస్వారూపా స్వతంత్రాణి॥
గంగేయముని సరస్వతి మూరునది యోళు।
సంగమ క్షేత్రది రంగుమంట పదోళు ౧॥

నీలిగిరియ మేలేతిశిదు నోడిరుతీరె।
మూల ప్రణవరూప, శీలాసీన హుదయ్యా ॥౨॥

సాసిరదళదోళు వానవాగిరుతి రే।
శశియష్టవర్ణ తాన సమాకసీనయ్యా॥౩॥
ఆరారు అరియద। మీరిదున్మనియోళు।
పరహిమగిరివాస। గురుబసవార్యనే ॥౪॥

అవతార ప్రభువెందెని సిదబసవగెఎత్తువెనారతియా ద్రేవాబెళగువె రతియా బాగెవాడి యోశ్చేగనెజనిసి అగషుబోధిసి। బసవా। ఆగవబోధిసిది।

యోగానందశివయోగమార్గదోళ్ రాగవతోరిసిది। బసవా। రాగవ తోరినిది ౧॥

అంగలింగదొళుమెరయువకప్పుడిసం గమనెనిసిద్ధి। బసవా సంగమనెనిసిద్ది లింగానంద శివజంగమయుత పద పుంగవనెనిసిద్ధి ౨॥



# తొలిపలుకు

నా బాల్యము నుండియు వీరశైవధర్మ సంస్కృతి-ఆచార-నాచారముల ప్రభావమునాపై నుండుటవలన, మరియు మహాస్వాములు పండితులయొక్క సాంగత్యములో నుండుటచేతను, నాలోకరుడుగట్టుకొని పోయన సంస్కారము మెండుగా ధృవపడుటవలనను, వెలుపలనున్న అన్యమతములశక్తినన్నే మాత్రము ప్రభావితునిగా నొనర్పమి. కేవలము వీరశైవధర్మమునకై నన్నంకితముగా జేసికొనినాడను, పోగా నాయథాశక్తి మన వీరశైవధర్మోన్నతికై పాటుపడుతున్నా మన సమాజములోని కొందరు దుష్టశక్తులనేక విధముల నా మనస్సునకు బాధలు గల్పించినను వాటిని శివార్పిత దృష్టితో సహించి సామాజిక, సాంఘిక కార్యకలాపాల్లో సహృదయతతో బాల్గొనుచు మన వీరశైవ సమాజమునకు ఉడుతా భక్తివలె సేవయొనర్చుచున్నాను. సాహిత్యరూపమున కొన్ని గ్రంధములను వ్రాసి ప్రకటించనైనది, కొన్ని అముద్రితములుగానే మిగిలియున్నవి. ఉదారవంతులెవరైన ధనసహాయబొనర్చిన యెడల వానినిగూడ త్వరలో వెలుగులోకి దేనగును.

ఈ వరకు ముద్రణ రూపమునందు కొనిన చిఱు గ్రంధములలోని 1 వీరశైవధర్మాన్వేషణము 2 రత్నత్రయము 3 నేనెవరు? 4 బసవేశ్వరుని తత్వములు 5. మహజ్ఞానిన్నిచన

బసవన్న 6 ఇష్టలింగార్చనావిధి: 7 వీర శైవ తరుణ గేయములనునవి వెలుగులోకి వచ్చినవి, చివర చేర్చొచిన వీరశైవ తరుణ గేయములను పొత్తము 1952 మె నెలలో వేయి ప్రతులను ముద్రింపగా నవి చేతులమీదుగా విక్రయింపబడి నావద్ద ఇప్పుడొక ప్రతి తప్ప మిగులలేదు. కనుక కాస్త దాని శీర్షికను మార్చి అనగా "వీరశైవ ధర్మ భావగీతికలు" అనే శీర్షికతో ప్రకటింపబడుచున్నది. ఈ భావగీతికలు ప్రాచీన కవితలోని యతి ప్రాస గణ విభజనాది సంకెళ్ళతో బంధింపబడక కేవలమాధునిక పక్కీలో గీతాలలోని భావ (విచార) తరంగములు శ్రోతలలేదా పఠితల (పాడుకొను వారి) హృదయ ఫలకములపై చదరనిముద్రవైచి, మనస్సానంద డోలికలో కొంతవడి తేలియాడునట్లుండుటకై ప్రయత్నించనైనది. తరజులునేటిచలన చిత్రాల పాటల మాదిరి కొన్నియున్నను వాటిలో మన వీరశైవధర్మతత్త్వములను ప్రతిబింబితములై యున్నందున శ్రోతలకు పాడుకొను వారికి సుబోధ కరములుగా నున్న వనుటలో సందియములేదు.

ఇంతకు పూర్వము 1974 (ఆనందనామ సం॥ము) ఆశ్వీజ శుద్ధ ౧౦ నాడు ఆరంభించిన 'వీరశైవధర్మ తత్త్వప్రకాశిక అను త్రైమాసిక పత్రికను 10 సం॥ములు నిర్వహించి ప్రస్తుతంలో దానిని ఆపితత్ స్థానె యీ చిఱుపొత్తమును ముద్రించి మన వీరశైవ సమాజ బాంధవుల కందజేయుచున్నాను.

కావున వీరశైవధర్మాభిమానులెల్లరు పత్రిక నిర్వాహణకై ఇంత వరకు తోడ్పడినట్లుగానే ఈ పుస్తకముల ముద్రణకు గూడ చంద రూపమునగాని, అథవా విరాళముల రూపమునగాని, మిగుల అధిక సహాయ మొనర్చినచో వారెకి నేనెంతయొ కృతజ్ఞుడను.

ఇంకను నారచితములైన వీరశైవధర్మమునకు సంబంధించిన శ్రీమదల్లమప్రభు, వైరాగ్యశిరోమణి అక్క మహాదేవి. ప్రతిజ్ఞాపూర్తి వంటి చిన్ననాటికలు, సాహిత్య గద్యరూపములైన శివానుభవమువంటి వ్యాసములుగల గ్రంధసంపుటములు ఇంకను వెల్గులోకి రావలసియున్నవి. యశఃకాముకులైన మహానుభావులు త్వరగా ముందుకువచ్చి ఆర్థిక సహాయమొనర్చి ధన్యులు కాగలరని మదీయకోరిక. ఇటీవలె ముద్రించిన బసవపురాణము. బసవవచనములు. శివగీత, శతకత్రయము వీరశైవ పౌరోహితము, ఉమామహేశ్వర వ్రతకల్పము జగద్గురు శ్రీరేణుకాచార్య చరితామృతము సిద్ధాంతశిఖామణి.

జ. పంచాచార్యులసంక్షిప్త చరిత్రమున్నగునవి వెలుగులోకి వచ్చనవి.

ఇట్లు

డా॥ పం॥ రాచవీరదేవర, "MOL" తీర్థ

గ్రంధకర్త

పెద్ద మఠము

జోగిపేట మరియు సదాశివపేట

# దండకము

శ్రీకరంబైన యాంధ్రప్రదేశంబునన్ మధ్యమాణిక్యమున్ బోలిబోనంబు కాధారమైనట్టి జిల్లాకు (మెదక్) తాలూకయందోల నన్ జేవళాఖ్యాపురంబందునన్ ముఖ్యుడై సన్మతాదీశ్వరత్వంబు గై కొన్న శ్రీసంగమేశాఖ్య మహేశ్వరుండొప్పుచున్ వీరేశగోత్రా ద్భవుడైనదా చారసంపన్నశీలుండు, ధీరుండు నౌనాతడా శ్రీమతిన్ శివ్వమాంబాఖ్య సాధ్వీమణిన్ బెండ్లియాడెన్ మహావైభవోపేతు డై, కొన్నినాళ్ళిట్లు మాహేశ్వరాచారశీలంబులదొప్పుచున్ దాను సంసారనిర్వాహమున్ జేయుగాగల్గి రవ్వారికిన్ బుత్రరత్నంబులు రాచయార్యుండనన్ శంకరాచార్యుండు, పంచాక్షరాఖ్యుండనన్, శ్రీషడక్షర్యభిఖ్యుండనన్ వీరయార్యుండు నానేపురున్ బేర్మవర్ధిల్ల గానందు పంచాక్షరీనాముడైక్యంబు నొందంగ శేషించునానల్వురన్ జేష్ఠుడౌరాచయాఖ్యుండురాణించె నింటన్ వహించెన్ స్వసంసార భారంబు, శ్రీ శంకరార్యుండు పాపన్న పేటన్ మఠాధీశుడై యుండిరాజిల్లగాస్వామి యా శ్రీషడక్షర్యభిఖ్యుడు తా జోగి పేటన్ స్థితుండై సదాశివ్వపేటన్ మఠాధీశతన్ బూని రాజిల్లె. వైరాగ్యతేజోవిశేషంబు మన్నించుచున్ భక్త బృందంబు పాదార్చనల్ సేయగా శీలతన్ దక్షతన్ బూజ్యతన్ గ్రాలుచున్ దానధర్మాది సత్కార్యముల్ సల్పుపుణ్యాత్ముడై (గొల్లశాడపనా

మమున్ జెందగా) కొల్లగాకీర్తులన్ జెందగా, వీరలన్ జిట్టితమ్ము
ండు వీరయ్యకున్ జేష్ఠుడౌ బుత్రు రాచయ్యనున్ దాస్వపీఠంబు
నన్ నిల్పెనీ రీతిసామాజక శ్రేయమున్ గోరుచున్ వేడ్కమైలింగ
పూజాధురీణునై యుండగానంతనా శంకరుండున్ సదా మోదకా
రున్ నిజాధీనమునన్‌జేర్చి కైలాసహాసున్ దగన్ జేసెందాన్॥

సీ॥ పరమేశు, జేరెనా భ్రాతయని తలంచి
వగచి వీరయతన భ్రాతృపదవి
కైలాతివారు రాజాలరనిగణించి
తనదు పుత్రుని గొనినిల్పెముదమున
వేడ్కనతడిట్టులా వీరనుతుగూడి
తనదు భక్తులమదుల్ తనియజేసె.
బాలుండు ముద్దులౌపలుకులు వినిపింప
వత్సలత దానతనింబంపెబడికి

తే, గీ॥ పిదపదల్లితండ్రి పెద్దకొమరుఁజూచి।
నెనరుతోయతీశ్వరునకొనంగ ।
నతండు స్వీకరించికుతుకుమ్మతో బెంచి ।
కారణాలు జరుపి జేరెశివుని॥

తే, గీ॥ యతికి సోదరుడైన వీరయ్యయంత
అన్నదివికేగ బాలునినాదదించు

వారులేరని తాదెచ్చిగారవమున।
బెంచుచుండెను దాజోగిపేటఁజేసి ॥

తే॥ గీ॥ శ్రీ కరుఁడు వీరశైవాబ్ధిశీతకురుడు
ప్రథితగుణుఁడు శ్రీ వీరయాహ్వయబుధుండు
తనదుపుత్రురాచయకు విద్యలను నేర్పి
యరిగెఁగైలాసమునకుఁవానంతమందు॥

కం॥ శ్రీవీరయాఖ్యసుగుణికి
బేరిమి పుత్రుండు రాచవీరయకరమున్
గూరిమితోడను విద్యల
నేరిచిపితృభక్తిగల్గి నెగిడెడునెపుడున్ ॥

(స్వీయకృతులు "శివశ్రీ")

శ్లో॥ మాతా మేనాగమాంబాచ
వీరార్యాచ పితామమ।
తయోః జేష్ఠపుత్రోహం
రాచవీరాఖ్య దేవరః॥

శ్లో॥ సంస్కృతాంధ్రాంగ్లభాషాను
హిందీకర్నాట కేషుచ।
పంచభాషాప్రవీణోఽహం
రాచవీరాఖ్యదేవరః॥

శ్లో॥ ఈశ్వరాఖ్యామహాసాధ్వీ।
సంగాఖ్యావిదుషీమణి।
తాభ్యాం ప్రణయ బంధస్తు ।
రాచవీరాఖ్యదేవరః॥

## అభిప్రాయము

డా॥ వే॥పం॥ శ్రీ పెద్ద మఠము రాచవీర దేవరగారు స్వరచిత భావ గీతికలను మధురముగా నాకు పాడి వినిపించిరి. వీని నాలకించి సంతసించితిని. వీరు చాల ఉత్సాహముగలవారు. సంస్కృతాంధ్ర కర్నాటక హింది భాషలయందు పాండిత్యము గలవారు "వీరశైవధర్మ" గీతికలను పెరకొన్ని భావగీతికలనప్పుడప్పుడు త్సాహముతో వ్రాసిన వానిని ఇక్కడ తప్పు ముద్రింపించి వీరశైవులకు జాగృతిని గల్గించి స్వమతాభిమానవంతులుగా జేయసంకల్పించినారు. వీరిభావతరంగములు గీతికలరచనా సంకల్ప రూపమున రూపొందినవి. సుధీజనులు వీరి విరచిత గీతికల యందలి సదాశయ సద్భావాదగుణములను మాత్రంవరి గ్రహించి "హంస క్షీరన్యాయమున' దొసగులను వదలివేయ గోరెదను, వీరికోరికను రిత్త యొనరింమట భావ్యముఃగాదని యెంచినాయల్పజ్ఞతకు దోచి నకొన్ని వాక్యములను వ్రాసి ఈ కవిని ప్రోత్సహింపుచు, ఈకవితాగానముతో దనివినందక వీరశైవ సంఘము నందలి సాంఘికాచారముల సంస్కరణముల

మరియువర్ణాశ్రమ ధర్మములననుసరించి గురు-లింగ-జంగమ భక్తి-స్వమతానురక్తి స్వీయజనోద్ధరణ కనుకూలమైన గ్రంధరచనలకుబూనుకొని, గద్యరూపమునగాని, లేదా సలక్షణ-ఛందోబద్ధ పద్యరూపమునగాని, గ్రంధ రచన మొనరింప ఈ కవి పుంగవుని యర్థించుచున్నాను ఇక్కాలమునందీ కవియొక్క ప్రబోధము భావికభోదర్కమై పరిణమించుగాత, ఉత్సాహ ప్రేరితులగు వీరశైవ యువకులు వీరిననుకంచి మాంద్యము నను్నమన వీరశైవులను జాగరుకులుగాఁజేసి యీ ప్రబోధగీతికలచేత సంపు శక్తిని గలిగించి వర్ణాశ్రమ ధర్మప్రబోధ మొనరించెదరుగాత.

ఈ కవి శేఖరులు సంస్కృతమున "కావ్యతీర్థ (కలకాత్తా) తెల్గులో ఉస్మానియా యునివర్శిటి" M.O.L. హిందిలో "భూషణ, కన్నడమున "జాణ" మున్నగు ప్రౌఢ పరీక్షలలోనుత్తీర్ణులగు టేగాకుండ జగద్గురు శ్రీరేణుకాచార్యులవారి యానువంశికులైన శ్రీరంభా పురిపీఠాధిపతులైన వీరగంగాధర శివాచార్యుల వారు, వీరికి "ధర్మనిరత" యనియు జ్ఞానసింహా సనాధీశులైన కాశిపీఠాధిపతులు జగద్గురు శ్రీవిశ్వారాధ్యమహాస్వాములవారు "పండితరత్న" యనియు, జగద్గురు సూర్యసింహాసనాధీశులైన శ్రీ వాగీశ పండితారాధ్యులవారు "షంభాపసరస్వతి" యనియు జగద్గురు శ్రీ కంచికామకోటి పీఠాధిపతులైన శ్రీ శంకరాచార్యుల వారు "సాహిత్యవిశారద" యనియు వీరుగావించిన వీరశైవధర్మ

సేవకు ప్రసన్నులై బిరుదములను ప్రసాదించియున్నారు. ఈ విధముగా నిరంతరము వీరశైవధర్మాభివృద్ధికి మరియుసాహిత్య-సాంఘిక-సంస్కృతులఅభివృద్ధికై పాటుపడుచున్న కవివరేణ్యులకు సదాశివుడు దీర్ఘాయురారోగ్యాదభ్యుదయములనొసగుగావుతయని ప్రార్థించుచు విరమించుచున్నాను.

ఇట్లు

డాకూరు మఠము సిద్ధి వీరయ్య
అందోలు తాలుకా, మెదక్ జిల్లా
జోగిపేట
తెలుగు సహోపాధ్యాయులు



# ప్రశంసన పద్యాలు

## సమర్పణ

శ్రీ ఎస్ పిళ్ళలోకాచార్యులు, M. A., & M. O. L.
భాషాప్రవీణ, సీనియర్ తెలుగు పండితులు

శ్రీ రాచవీర దేవర।

భూరియశః కిరణజాల పూర్ణగురువరా।
శ్రీ రమ్య వీరశైవజ (వీర వంశజ)
నారాధిత పాదపద్మ ః ఆచార్యవరా।

మాటలులేనివాఁడు, కదు
మన్ననతోడు నున్నవాడ, మో
మాటము చూపువాఁడు మరి
మోసము చేయనివాఁడు, ధాత్రినా
రాటము చూపకెప్పుడును
రంజిలువాఁడు ప్రవర్తనంబునన్
సాటికి పోటికెవ్వడునురా
జాలడు దేవరతోడనిచ్చలున్

ఏద్దెలమిన్న అంతకును పెద్ద, పవిత్రపు వర్తనంబునన్
హద్దులులేని భక్తి, హరునందును, దేశికునందు భక్తులం
దద్దయునాదరమ్ము శరణార్థులయందును చూపించునందునన్
ఎద్దునునెక్కురౌతుసిరులిచ్చుత నీకును వీరదేవరా ।

## సన్నిహిత మిత్రుని యభిప్రాయము

"పండితరత్న,, భూషిత-వరద" జాణ,,
"కావ్యతీర్థ,," ధర్మనిరత-కవియుశ్రేష్ఠ
రాచవీరదేవర శివ-రహోయుముదము
మానసవిహారమమతయు-మధురసీమ

సంస్కృతాంధ్రనిష్ణాతయు-సరసమౌళి ।
"వీరశైవధర్మ" ప్రకాశ-వీరశూర
శంకరానందప్రియమూర్తి-శక్తికొలది
శ్రీయుబసవేశ్వరుని భక్తి-సిరినిగూర్చు

డా॥ వే॥ పం॥ శ్రీ పెద్దమఠము రాచవీరదేవరగారు మఠాధిపతులు, చక్కని పండితులు, కుశల ప్రవక్త, విద్యార్థిలోకానికి మరియు నుపాధ్యాయలోకమునకును వరమహితులు, వీరిసంస్కృతాంధ్రకన్నడ హిందీ భాషలలో వ్రాసిన గేయసంపుటిని జూచి చాల సంతోషించితిని, వీరు। 1. వీరశైవధర్మాన్వేషణము 2. బసవేశ్వరునితత్త్వములు 3. వీరశైవ తరుణగేయములు

4. మహాజ్ఞాని చన్నబసవన్న 5. రత్నత్రయము 6. ఇష్టలిం గార్చనావిధిః మున్నగు గ్రంథములను ప్రకటించియున్నారు. ఇంకను శివానుభవవ్యాస సంగ్రహటి, చిన్ననాటికల సంపుటములు మున్నగునవి వీరిరచనలు వెలుగులోకి రావల్సియున్నవి. వీరశై వులందరు వీరిని ఆర్థిక ముగా ప్రోత్సహించిననే వీరిప్రజ్ఞాపాట వములు వీరశైవధర్మ నూతన తత్త్వములు బహిర్గతములగును.

"కృణ్వంతో విశ్వమయం వీరశైవం" అను నినాదమును గల్పించిన వీరు ఈ మతమునకై దనజీవితమునే కైంకర్యమొ నర్చిన దివ్యమూర్తులు, మన సమాజమునుండి యితోధికముగా వీరిటుదగిన ప్రోత్సాహమందగలదని నాకు నిండు నమ్మకము గలదు, వీరుస్థాపించి నిర్వహించుచున్న త్రైమాసిక "వీరశైవ ధర్మ" అను పత్రికకు పదేండ్లు నిండినవి. వీరు చంచల్‌గూడ జూనియర్ కళాశాలనుండి పదవి విరమణమును గావించియున్నా రు, ఆంధ్రప్రదేశమున రాత్రింబవళ్ళు ఈ మత ప్రచారమునకై యెన్నియో విధాల ప్రయత్నాలు జేయుచున్నారు. వీరికి ఆపర మేశ్వరుడు ఆయురారోగ్యసుఖసంపదలనొసగుగాక.

సాహిత్యవాచస్పతి
రాచోటి శంకరసాస్త్రీ

(Rtd) హింది విభాగాధ్యక్షుడు గవర్నమెంటు సిటికాలేజు
హైదరాబాదు-500 002. (ఆం ప్ర)

# ప్రార్థన

యోవేదాదౌస్వరః ప్రోక్తో-వేదాంతేచప్రతిష్ఠిత ః
తస్యప్రకృతిలీనస్య-యఃపరస్సమహేశ్వరః ॥

(స్వామి శరణం అయ్యప్ప)

సాక్షాద్విష్ణుస్స్వయంమాతా । పితాయస్యమహేశ్వర॥ ః
తంవందేసర్వభూతేశం। శాస్తారంకరుణానిధిం॥
(కేరళశబరిమలైస్థలపురాణె)

యంశైవాఃసముపాసతేశివ ఇతి బ్రహ్మేతి వేదాంతినః।
బౌద్ధాబుద్ధఇతి ప్రమాణపటవ:కర్తేతినైయ్యాయికా:॥
అర్హన్నిత్యథజైనశాసనరతాః కర్మేతిమీమాంసకాః ।
సోఽయం వోవిదధాతువాంఛితఫలంత్రైలోక్యనాథోహరః।
(బేలూరుశిలాశాసనము)

"ఒకపుష్పంబు భవత్పదద్వయముపై నొప్పంగసద్భక్తిరం
జకుడై పెట్టిన పుణ్యమూర్తికి బునర్జన్మంబులేన్నఁబా
యకకాలత్రితయోపచారములనిన్నర్చించుచోఁబేద్దనై
"షికుడైయుండెడువాఁడు నీవగుటదాజిత్రంబె సర్వేశ్వరా॥"
దంతమ్మల్ పడనప్పుడే. తనువునన్ దార్ఢ్యంబు పోనప్పుడే.
కాంతాసంఘమురోయనప్పుడే. జరాక్రాంతంబుకానప్పుడే

వింతల్ మేన జనింపనప్పుడే, కురుల్ వెల్వెల్లకానప్పుడే
చింతింపన్వలెనీపదాంబుజములన్ శ్రీకాళహస్తీశ్వరా ॥

**:నివేదన:**

ఓ పరశివమూర్తి : పరమేశ్వరా । శివశివా ॥
దీనబంధో । భక్త వత్సలా। కరుణానిధె ।
దయాసాగరా । సచ్చిదానంద నిత్యపరిపూర్ణ ॥
నిరంజన । నిరవయవ । చిజ్జ్యోతి లింగమూర్తి :
మానవసమాజము : నిష్కళంకమై :
నిర్మలమై శాశ్వతానందము నొందునటుల
సర్వదా అనుగ్రహింపుము తండ్రీ ।

**మమ్మావరించియున్న**, జాడ్యమును, మనోదౌర్బల్యము ను దొలగించి, ధర్మజాగృతి. మానవ సమాజమును సంరక్షించి **ఆత్మోన్నతిని మరియు** సుఖమయ జీవితమును సాగించుటకై నవచైతన్యమును నిత్యవినూతన స్ఫూర్తిని స్థిరచిత్తమును, దృఢసంకల్పమును, గట్టి ధైర్యమును ప్రసాదింపుముతండ్రి.

శ్రీ రేణుకాచార్య, బసవాది ప్రథమపుంగవులారా : శ్రీ మదల్లమ ప్రపథవర్తక శివయోగనిరతులారా: మీరు మానవసమాజక్షేత్రమున, ఆచార, విచారములను బీజములను నాటి, మీయ సాధారణమైన భక్తితత్త్వదర్పణము మా హృదయ ఫలకము నందు ప్రతిబింబింపజేయుడు మీ పరిశుద్ధమైన మరియు మధుర

ంబైన శివానుభవామృత పానము వలన మానవ సమాజము శాశ్వ
తముగా జీవకళలతో తొణికిసలాడుచుండుగాక ఈషట్ స్థల
బ్రహ్మజ్ఞానము మరియు లింగాగ సామరస్యదివ్యజ్ఞానము, మా
మోక్షసాధనమునకు మూలమై సర్వదా వి రాజిల్లుగాక ఓం శాంతిః
శాంతి ః శాంతి :



(స్వకీయ రచనలు)

## ప్రార్థన

కం॥ శ్రీకంఠనామము సదా
యేకంఠమునందునుచ్చరింపఁబడునో
యాకంఠముగలవారికి
శ్రీకంఠుడిచ్చుగాతఁశివములసతమున్

కం॥ మలహరనినునేఁగొలిచెద
కలిసంతరణంబుగోరి, కాలవిభేదీ,
మలలితమగుమత్కృతినిస
త్ఫలితముగాఁజేయుమయ్య. ఫాలాక్షశివా! ॥

శా॥ వి॥ తోరంబౌనుదరంబుదాల్చికడుసంతోషంబుగల్గింపగన్
భారంబౌనిజవక్రతుండమునందంబెంతో శోభిల్లఁగాన్

సారంబౌఫలమూలపాయసములనాస్వాదించుచున్ ప్రీతిమై
గారుణ్యంబున(బ్రోచునీకిదేనమస్కారంబువిష్ణ్వాధిపా॥

శ్లో॥ నమోఉగ్రస్వరూపాయ. నమోజిష్ణ్వాదిశాస్త్రవే।
దక్షయజ్ఞవినాశాయ, వీరభద్రాయతేనమః॥

శా॥ వి॥ శ్రీకల్యాణపురాజబిజ్జలుని మంత్రి శ్రీపదంబొందియున్
రాకాచంద్రునిగాంతిమించుయశమున్ రంజిల్లగాధారుణిన్
లోకారాధ్యుడవైన శ్రీబసవ । సుశ్లోకుండవైనట్టినిన్
నాకావాసులు భక్తిగోల్తురిమదిలోనన్నిల్చినన్నేలుమా॥

కం॥ వరకవిపదపద్మములన్
స్థిరముగధ్యానించినేను ధన్యుడనగుచున్ ।
నిరతముతదనుగ్రహమున
విరచించితివీనినిట్లు వేడుకతోడన్ ॥

కం॥ చిరకాలముగనుమనకై
వరవీరకవులుగరుణను వ్రాసినకృతులన్
గురుతరభక్తినిజదువుము
గురుతింపుడు వానిలోనిగురుధర్మములన్

కం॥ వరుసనాంధ్రదేశముననూ
దొరవినమనవీరశైవదుర్దశకెంతేన్
దురపిల్లుచుదన్మతీయుల(
గరముద్బోధించి వ్రాయ(గడ(గితిదీనిన్ ॥

## వీర శైవధ్వజారోహణ గేయము

ఎగురవే ఓ వీరఝుండా।
ఎగురవేమావీర ఝండా।

ఆదిశైవులునిన్ను ఆదరించినవేళ
అష్టదిశలోనీదుభేరిమ్రోగినవేళ
వెల్లివిరిసెనునీదుయశము
కొల్లగొట్టెనుసాంద్రనిశను ॥౧॥

రెడ్డిరాజులలోన ఖ్యాతిగాంచినరాణి
విద్దతైపగతులన్ పాఱద్రోలినమహా
రుద్రమ్మనలరాజు నాగమాంబలశౌర్య
ముద్రలై వెలసిన ముదితశైవుల సీమలో ॥౨॥

తరతరంబులనుండి పరిపక్వమైపండి
గురుతరక్షీరమున నవనీతమునుబోలే
వీర శైవ పదమ్ము వీరులనేపరియించె
వీరశైవులపుణ్యభూమియగునాడులో ॥3॥

శ్రీరేణుకాచార్యవరులల్లమ ప్రభుల్
భూరి ప్రతాపులగు బసవాది ప్రమథులు
నిరతధర్మక్రాంతిఁలేపినిలిపినఝుండ
సర్వజనాశ్రయంబౌనఁగి మెఱసిన ఝుండ ॥౪॥

పాండ్య కేరళచోళప్రముఖకాశ్మీరముల
ఫాలలోచనభక్తవరులెల్లభూపతుల్
పోరిజగమునశాంతి ధర్మమ్ముస్థాపించు
వీరశరణులనాటి వీరశైవులఝండ ॥౫॥

   

## ఇష్టలింగస్తుతి

(అబుతేరేశివాకౌనుమెరా అనుమాదిరి)

ఇంకనెవరుగతియిలలో నాకు ఇష్టలింగయ్యా ।
ఇహకష్టములను బారద్రోలు ఇష్టలింగయ్యా ॥ ప॥
భవపాశమునజిక్కి నేను భంగమొందితి ॥
భయభక్తియుక్తుడనుచునన్ను భరియింపుమా ॥౧॥
సుగంధమైనధూపదీపనైవేద్యములచే
సహృదయమునవిన్నునేన బూజంతును ॥౨॥
అహర్నిశలునిన్ను నేనుమదిలోదలచితి ।
అటులైనకృపయురాదుగదేః ॥ ప్రాణలింగయ్యా ॥౩॥

## జగద్గురు శ్రీరేణుకాచార్యులవారి స్తవము

(అబుతేరెశివాకౌను మెరాఅనురీతి)

జగదేకమూర్తి వీవేగదా । రేణుకవర్యా ।
భగవంతునియవతారమున వెలసితివయ్యా ॥ప॥

చరమూర్తివైనసీవుకొలనుపాకలో ।
నిర్మలమగులింగమునయుద్భవించితి ॥౧॥
శివశక్తికళాయుతుడవయ్యి వెలసితివయ్యా ।
భగవాన్, భగవాన్. భగవంతుడవై మాకు
పథముజూపితివయ్యా ॥౨॥
వరవీరశైవధర్మసూక్తిజాటితివయ్యా ।
గురుమూర్తివైజనులబాధబాపినావయ్యా ॥౩॥
ధరలోనగస్త్యఋషికిబోధగఋపినారయ్యా ।
శివదీక్షయొసఁగివీరశైవమతము నిలిపినారయ్యా ॥౪॥

## బసవక్రాంతి

(స్వామిబసవేశ్వర్‌దునియామెక్యాకర్‌గయా అనురీతి)

స్వామి బసవేశ్వరుండేమి జేసెనయా ।
సామవాదనినాదంబుజాటెనయా ॥పల్ల॥

భరతఖండము చీకటితో వ్యాపింపగ
భాగ్యభాస్కరుడై యుదయించెఘనుడీతఁడు ॥౧॥

ఉచ్చనీచత్వభావములఁదొలగించెను
యోచనీయుడై వీనినిసాధించెను ॥౨॥

జాతిజాతికిభేదములు గల్గుండగ
జనశక్తిచే సంఘముస్థాపించెను ॥౩॥

హిందువులలోన స్పర్శమేలేకుండగ
అందముగతాను ఏకముజేసెనయా ॥౪॥

పశుబలియాగములఁదానుఖండించెను
పరమభూతదయనుదాను జూపించెను ॥౫॥

వర్ణసమైక్యతనువసుధలోనెలకొల్పెను
వెనుకబడయున్న మతములఁగాపాడెను ॥౬॥

శిష్టమనుజుల కష్టములదొలగించెను
అష్టావరణ విశిష్టతనుబోధించెను ॥౭॥

జ్ఞానశూన్యులకు మార్గమును జూపించుచు
జ్ఞానయోగులచరణములఁబూజించెను

❋❋ ❋❋❋ ❋❋

## -శ్రీబసవస్తుతి-

(శరణార్థింక్షంపవె, అతిఘోరజననమరణము ద్రుంచవేలింగాశర
ణార్థి అనురీతి)

నందీశనన్నుబ్రోవుమా। బసవేశ।
నమ్రమత్వమునవేడితి। బసవా॥ ॥పల్ల॥
భవసాగరమొునన్నుదిగఁవిడిచి।

బాధించుటిదిన్యాయమా । బసవా ॥౧॥
లోకనమునసుండు జనులు । నను జూచి ।
లోభివనియందురయ్యా బసవా ॥౨॥
పాపపుణ్యములనేను । ఎఱుగని ।
పసిపాపతోసముడను । బసవా ॥౩॥
ఇహలోకతరణమునకు । ఇకనీవే ।
యాధారమైయుండుమా । బసవా ॥౪॥
మాయ మోహితుఁడనయితి । నీమధుర ।
వచనములనేమరచితి । బసవా ॥౫॥
తొలగించియజ్ఞానమున్ । నీవధిక ।
సుజ్ఞానమున్నొసఁగుమా । బసవా ॥౬॥
గాఢాంధకారమందు । నేనుండి
గాసిఁజెందుచునుంటిని । బశవా ౭॥
కామమను జీకటియు ।నా, కనులను ।
గప్పివేయుటచేతను । బసవా ॥౮॥
తలిదండ్రినీవేనాకు । దేవనా ।
తప్పులెన్నకబ్రోవుమా బసవా ॥౯॥
పంచేంద్రియములునన్ను । పీడించి ॥
పంచత్వమునుఁజేర్చురా। బసవా ॥౧౦॥
ఖలులుషట్శత్రుసమితి : నామనసు ।
కళవళముజేసెనయ్యా । బసవా ॥౧౧॥
ఈ సర్వకష్టములను । దొలగించుటకు

నాకుదిక్కు నీవె, । బసవా ॥౧౨॥

రాచవీరునివాక్యముల్, ప్రేమతో ।

నాలించువారిలకును । బసవా ॥౧౩॥

సకలసౌభాగ్యములను । గరుణించి ।

సానుభూతితో బ్రోవుమా । బసవా ॥౧౪॥

ఇహలోకభోగములను । కరుణించి ।

పరలోక జిరసౌఖ్యమున్ । బసవా ॥౧౫॥

భక్తులకునీవిచ్చెదో । యనినేను ।

బతిమాలివేడుకుందు బసవా ॥౧౬॥

## తత్త్వము:-

శివయను శివయను । శివయనుమా ప్రాణి ।

శివయనకపోతె । పరమశివునియాన ॥పల్లె॥

దానమెఱుగనిధనము । దాచియుంచావు -

తనువరిగే కాలమున । దలచవుశివుని ॥౧॥

సతిసుతహితులను । బ్రోచినప్రాణి ।

మృతిజేందెకాలమున । కానవెవ్వరిని ॥౨॥

నీరుబుగ్గవంటి । దేహము ప్రాణి ।

మారహరునిధ్యాన । మొనరించు ప్రాణి ॥౩॥

నరజన్మంబిదినీకు । అస్థిరము ప్రాణి ।

రాచవీరునిమాట । నాలించు ప్రాణి ॥౪॥

## ఇష్టలింగస్తుతి

(జీవన్ కెనావనడోలె, అనుషాదిరి)

అఱచేతనున్న లింగమే । అయోగా ।
అమరతరువు । మోక్షమునుగోరువారికి ॥ప॥
సకల ప్రపంచమంత । నిండియున్నాది । యిందు ।
సవినయముగ । ధ్యానించుమి ॥ అయేగా "అమర ॥౧॥
ఆయిష్టలింగమున । నమరియున్నాది । జ్యోతి ।
కనురెప్పవేయకచూడు । కనుపించునా పరబ్రహ్మం ॥౨॥
అంగముననుండులింగము । సంగతినెడబాయకుము ।
యుంటీపెచూడుముసుమ్మీ । పోయెను బ్రాణమయ్యాయ్యో ॥౩॥
లింగమె దృష్టియని । లింగమేకర్ణమని ।
లింగమెనాసికమనియు । గమనించుమీఘటమందున్ ॥ ॥౪॥
మనమేకలింగమని । జిహ్వేకలింగమని ।
స్పర్శమెుకలింగమనియు । భావించుమీఘటమందున్ ॥౫॥
కామధేనుపరుషమణి । చింతామణులు :
కామించినవారికెల్లాను । కరుణించునీయిష్టలింగం ॥౬॥
ఓంకారమెలింగమని పంచాక్షరిమంత్రమనియు ।
నాసికాగ్రంబుపైనుండి । దృష్టినినిల్పిచూడండి ॥౭॥
చిత్తమునలీనమైన, చిజ్జ్యోతిని యెఱుగుటకు ।
అంజనమని దెలియుముసుమ్మీ ॥౮॥
చలమైనచిత్తమును । స్థిరముగదృఢపరచుటకు ।

సులువైనసాధనమనియు।తెలియుమి ఇదే ప్రమాణం! ॥౯॥

రాచవీరునిగ్రృతిని । యాచరించితిరేని।

వాచకులగుమీకు సౌఖ్యముల్ దడయక।నోచినవారికే చెందుభువిని ॥౧౦॥

## ప్రబోధగీతము

(మార్చింగ్ సాంగ్ మాదిరి)

వీరఝండయెత్తవోయి । వీర శ్వేమ జూపవోయి

వీరశైవులనైక్యపఱచి । విశ్వమంతజాటవోయి ।

విశ్వమంతనీదేనోయి ॥ప॥

కరమునఖడ్గముదాల్చవోయి । సరగునశత్రువులజీల్ప వోయి-

ఉరమునలింగమ దాల్చవోయి । శిరమునకరములనుంచవోయి-

శరణులపదములవేడుమోయి ॥౧॥

మతసిద్ధాంతమ (మండించి । మరచినశైవులసురప్పించి।

మనుశోవారికి మతబోధలనుగావించి ।

మాన్యులనెల్లరపిలిపించి ॥౨॥

ఓంఝండయెగురవేయి । ఓర్పుతోశంఖబూదవోయి ।

హరోంహరోంహరహరయనుచును। విజయనాదము జేయవోయి।

విశ్వంబంతయు నెఱుగాలోయి । ॥౩॥



## యువకులశపథము

మేము బసవనాయకుని సైనికులము
సముదంచితవీరపరాక్రములము
రణరంగమందుపోరాడెదము
ఘనమైనసాహసముజూపెదము ॥ప॥

వాదవివాదములసల్పి
ప్రతివాదులసభలోపలగెల్చి
దీక్షాసంస్కారముసల్పి
మోక్షాపేక్షులగావించి ॥౧॥

శివలింగముఁ, బ్రసాదించి
భవసంకటములఁదొలగించి
అష్టావరణములనువివరించి
నిష్ఠతోషట్ స్థలవిధమునుదెల్పి ॥౨॥

దేశసేవయే ఈశుసేవయని
బాసచేసిన బసవనిభటులము
వాసికెక్కినబసమహాత్మునిసి
నాసక్తితో మదివలచండి ॥౩॥

బసవననిజస్వాతంత్ర్య క్రాంతికై
మసలకయెత్తిన ఓంపతాకము
దశదిశలలోవెలసినఓంపతాకకు
అసదృశమగుజయమునుగూర్చెము ॥౪॥

# ఆత్మతృప్తి

(భాగ్యశాలినై తినెఆనుమాదిరి)

భావ్యశాలినై తినె । నాభవుండునాకులభించెను ।
భవ్యజీనినేనే । ధన్యజీవిని నేనే ॥ప॥

జన్మనాదుతరించెనె - జంగమసేవాలభించెంనె ।
లింగపూజలుఫలించెనె । గురునిబోధల్ భరించెనె ।
నిగనిగలాడెనిశ్చలశివునకు । మల్లెమొల్లలను జల్లెదనే
మమతతదీఱగావిసరెదనె ॥౧॥

మమతతోరప్పించి । మనసును బంధించి ।
మార్గముజూపును । మాశివుఁడు
వ్యసనము మఱపించి । మనసును మురిపించి ।
మంచిజేయును । మాశివుఁడు
అటునిటుతిరిగివచ్చేశివుఁనకు ।
అర్ఘ్యపాద్యములనొసగెదనె ।
వింజామరతో వేసరకయనునేవినరెదనె ॥౨॥

తెల్లనిదేహముగలవాఁడే । నల్లని గొంతుకలవాఁడే
నల్లనిజడలోతెల్లరేఖనిడి । ఎల్లలోకములనేలాడే ।
వెండికొండపైవెలసేశిఁవుడు । వేడుకతోననుజూచాడె । ॥౩॥
తెల్లనియెద్దునుఎక్కాడే । తెల్లత్రిశూలము । బట్టాడె ।
బ్రహ్మకపాలముదాల్చినశివుఁడు । నన్నేలుటకైవచ్చాడే ॥
బిఱబిఱపరుగెత్తుతుపోతా । సరగునశిరమును పదములవేస్తా ।౪।

## భగవదాహ్వానము

(ఓ పరదేశి, ప్రేమపిపాసి రావోయి, అనురీతి)

ఓ పరమాత్మా । ప్రేమసుధాత్మా । యోగిజనాత్మా ।
రావోయి । దీనజనాత్మా రావోయి ।
మమ పూజాఫలమా ।
మమసంచితఫలమా ।
మంగళమయుఁడా రావోయి ॥ప॥

అందచందముల । అలరువిల్తుని ।
అంత మొనర్చినయమరుఁడవోయి ।
భీకరుడగునా ప్రేతరాటుని ।
ప్రాణకంపనము జేసితివోయి ।
మహిలో మహిమలు । మఱచిననారికి ।
మతికినియందవు । మహాదేవా ॥౧॥

బిఱబిఱతిరిగే పురములద్రుంచిన ।
భీకరరూపుఁడవీవుగదోయి ।
భస్మపుంద్రములదాల్చితి వోయి ।
భవ్యసర్పములభూషుఁడవోయి ।
జలజలపాఱుగంగనుజడలో,
ముడిచినమూరితి వీవుగదోయి ॥౨॥

## లోకహితముఃకై వేడుకోలు

జగదీశ ప్రభో ఒసగుసదా విడని సుఖమును, దృఢభక్తవత్సాలా ।
భో! క్షణక్షణము, పాడుచును, వేడితినయ్యా। కడుధన్యుడనయ్యా ప।
భో! సరస్వతియ। వరకృపను, త్వరగనొసఁగుమా ।
చిరసౌఖ్యమొసఁగుమా । కరుణాభరణా, దురితహరా,
బ్రోవు మహేశా! అతిప్రీతిచేతను ॥౧॥
గతవీరుల, స్థితియను, నీ స్థిరపఱచుమయా। మతినీయుము ప్రభువా
హతభాగ్యులను, పతితులను, సతము బ్రోవుమా । పర
భారతియులా ౨

## దైవప్రార్థన

జనన, మరణ, దురిత, శమన। శరణజనులఁ బ్రోవుదేవా ॥ప॥
భవభయవినాశకరా । భక్తజనసంతోషకరా ॥౧॥
ఊర్ధ్వసృష్టినిర్మాణకరా। బుధజనసంతాపహరా ॥౨॥
రాచవీరకృతిపోషకరా । రాగిజనహృదయభరా ॥౩।

## విరహము

(సంస్కృతము "యమునాజళికేళోకేళకనయ్యాక" అనురీతి)

సకలకలాన్విత శీతకరా। జగవందితా। వందితా। సేవితా ॥ప॥
సీలిమయ్యేగగనేస్థితా। నక్షత్రగణసంసేవితా
సతీవిరహితయూనాం। పతివిరహితస్త్రీణాం।
తాపకరణేపటుతరా। పాహిమాం హేసుందరా।
సుగుణావరమునిగణతోషకరా।సుఖకరా ॥౧

# మనోభోధ



("టిక్కుటిక్కు, టిక్కుటిక్కు, టమకులబండి" అనురీతి)

చెట్టుచెట్టు-గుట్టగుట్ట-తిరిగేమనసు ।
చరించెమనసు । చంచలమనసు । మర్కటమనసు ॥ప॥

కదలక మెదలక తిరుగునండి ।
కూర్చునబెట్టుకాయమునుండి ।
చల్, చల్. చల్, చెదరిపోయిఎదురువచ్చె ।
దేశములన్ని । చుట్టి చుట్టి । తొంగిచూచి । వచ్చేదిమనసు
ప్రశాంతమైనగిరిగుహలందున్ ।
సంతులమర్లైతపమెసగున్ ।
కీలుదప్పితే, కాలదన్నితా ।
కలిసిపోవునిర్మలవాయువునందు।
జఙ్జున, జాటిపోయెజడదేహమా ॥౨॥

తిరిగేదిదేశం । తినేదిమెదడు । తిరుపాలి ।
ఆయుతీరితే । అనుసరింపక ।
బుస, బుస, బుస । యని । ఎ సిపోయేమనసుకు ।
కసిబిసిపడుట, యెందుకే ॥3॥

("ఓమేఘరాజా, అనుమాదిరి)

ఓ బసవారాజా । నీదర్శనమెపుడో । వృషభరాజ ॥ప॥

నీకాళ్ళకుగజ్జులుగట్ట । నీ మెళ్ళోగంటలువేస్తా ।

నీవీపునజూలువేస్తా । నీ కొమ్ములకు రుద్రాక్షలుజుడ్తా

నీరాకకునేవేచియుంటా ॥౧॥

చెప్పవయ్యా । ఓబసవరాజా ॥

చెప్పకుంటెనేమానేస్తా ।

తప్పకుండనీదర్శనమొసఁగుము ॥౨॥

గంగిరెద్దుపై గంతులు వేస్తూ ।

గల్లుగల్లుమనీ గజ్జెలుమ్రోయగ ।

నందివినీవు పసిగందునునేను

చెప్పవయ్యానీదర్శనమెపుడో ॥3॥



## ఓ వీరయువకా

శ్రీయాదికవివర్య, శ్రితజనమందారు
పండితసంసేవ్య, నన్నెచోడు
రాకేందుయశోభూషు, రారాజుసత్యేంద్రు
తనయునిదలదున్మి, ధర్మమ్ము జాటె
వీరశైవధర్మవిజయశంఖంబూది
విజయ రథమును నడిపినవీరబసవరాజు
దేవరరూపొందిదివినొనర్పగవచ్చె
భువికి నిరాకారుడల్లమయ్య
పెద్దతేజినెక్కి పాశ్చాత్యులఁగెల్చి
రాజ్యమేలిన దిట్టకిత్తూరుచెన్నమాంబ
మదముతోనెదిరించివచ్చిన రిపులఁద్రుంచినయట్టి
ఓరుగల్లుకురాణిరుద్రమాంబ
ఇందరుబంధువులుండనీకేలభీతి
కొందరనాకనింకెందరోగలరుభువిని
మందమతివిగాక మసలుకోఇలనీవు
వందనము సల్పుమా । ఓ వీరయువకా ”



## శీతకాలపు బెదడ

వర్షాకాలముగడిచేనదిగో
శీతకాలముగవిసెనిదిగో
భీతితోమూసిరి కవాటములను
మూతలువైచిరి గవాక్షములను

ఆహా-అహాయనుచు బీదలు
చలికినిగొంకిరి, మంటలుగాపిరి
ఇంటికప్పులుజాలవయ్యెను
వెంటకుప్పలునిలుపవయ్యెను

బంటినింద వస్త్రముల్కరవయ్యే
కడుపునిండ, కూడునులేకయే
గడగడపడకుచునుండిరికొందరు
మలమలమాడుచునుండిరి కొందరు

గోడునువినువారెవ్వరులేరుభువిలో
బడుగులను బదుకించెదెవ్వరు ఇలలో
కడుబడలుటయే నీ విధియనికొందరు?
బడుగులఁగసరుచుబలికిరికొందరు

ధనికవర్గముదారినిబోవుచు
కనికరించక కారులోబోవుచు
ఉన్నతసౌధములందునుగులుకుచు
నున్న యువ యువకులఁజూచుచుందురెపుడు

చిన్నబోయిదరిజేరగవై తివీవు
కున్నభయమదిదెలుపపైతివేల:

బింకము(దెలసెను పోచలిరాజా ।
జంటలబిగుకౌగిట(జొరబడే
సందికలేదవినిలచియుంటివి గదా:
పంచలుగాచెదుఓ ॥ చలిరాజా నీ
పొంకముదెలసెనుపోచలిరాజా



## యుగాది పర్వదినము

అదిగోవచ్చెను, ఇదిగోవచ్చెను
ఉగాది పండుగ పర్వదినం ॥ప॥

సముద్రదమధన। సందర్భమున
సర్పముగ్రక్కిన, హాలాహలమది
జగములనెల్లన్నిలువునబ్రేల్చె

కరాళచిచ్చును దిలకించినయా
సురాసురులుపరువై త్తిరియిటునటు
కొందఱుగొల్చిరి శివు(దర్శించియు
ఆర్తత్రాణు(డభయంబిచ్చెను

భీకరరూపుఁడు భీమకపర్దియు
ముల్లోకాలకు మృత్యుగమారిన

హాలాహలమునుగొనియఁజేతన్
గళమందుంచియుజగములఁబ్రోచిన
గఱలకంఠున్నినిరఁతముదలచి

మక్కువతోమనమందరమిక్కడ
చక్కెరవేవపూ మామిడిముక్కలు
చక్కనిక్రొత్త చింతపులుసులో
గ్రక్కున పండ్లముక్కలుగలిపియు

ముదముతో బంధు మిత్రులఁబిలచియు
ముదముపొంగగనాస్వాదించియు

మఠమందిరములఁసందర్శించియు
దిటముగగురుపంచాంగశ్రవణము
స్ఫుటముగవినిబలుప్రశ్నలువేసియు
దక్షిణలొసఁగి దండముబెట్టియు
అయ్యగారియాశిస్సులబడయుచు
ఆరగిరిభక్తులు నిజగేహములకు



# వీరశైవాచరణము (ఆహ్నికము)

("ఘర్ ఆయా మేరపరదేసి" అనుమాదిరి)

తలచండి శివనామమును
నిలపండి నిజధర్మమును ॥ప॥

పాపమును-పారద్రోలునది
పుణ్యమును-సమకూర్చునది
లింగమును-నీవు-వీడకుమా
జంగమును-నీవు-దూరకుమా

ఆ... ... ...........ఆ.................ఆ............... ॥౧॥

ఉదయమునన్ నిద్రలేవగనే
శౌచక్రియాదులఁదీర్చుకొని
చన్నీటిస్నానముఁజేయండి
చలువనిదుస్తులఁదాల్పండి

ఆ..............ఆ.... .........ఆ.................. ॥౨॥

పత్రిపుష్పమ్ములఁదెచ్చుకొని
గంధాక్షతలను దెచ్చుకొని
ధూపదీపంబులఁగూర్చుకొని
భస్మరుద్రాక్షలధరియించు
పరశివలింగముఁబూజించు

ఆ..............ఆ ..............ఆ.................. ॥౩॥

